విడిపత్రిక ౧ అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ ౬ ౧౦౩౨౨ అక్టోబరు 14 వ తేది 1935 సోమవారము అర్ధ సం॥ చందా రూ 3

సంపుటము ౧౦. తూపుబజారు, హైద్రాబాదు - దక్కన్. సంచిక ౪౩

శా. శ. ౧౮౫౭ శ్రీ యువ సం॥ ఆశ్వీయుజ బ॥ ౩ సోమవారము. అజూరు ౧౩౪౫ ఫ.

# ఇటలీ ఆబిసీనియాల యుద్ధము

## అబిసీనియా ఇటలీల యుద్ధ చక్రము వెనుకకు తిరిగినది

### అడోవాలో ౨౫౦౦ ఇటలీయులను అబిసీనియులు ఖైమాచేసి, వేలకొలది యుద్ధ సామగ్రిని వశపరచుకొనిరి

అబిసీనియులచే ఇటలీవారి విమానము ధ్వంసము చేయబడుట

ఉలావల్, వార్డేరు నగరములు అబిసీనియులకు చిక్కుట

#### అడోవా రంగము

అక్టోబరు ౩వ తేదినాడు ఇటలీ సేనలు ఉత్తరమున ఎరిత్రియాలోనుండి అబిసీనియా సరిహద్దులుదాటి ముందునకుపోయిరి. వీరికిని అబిసీనియా సైనికులకును అడోవ నగరమువద్ద గొప్పయుద్ధము జరిగెను. ఇటలీ సైనికులు విమానములలోనుండి దాటిపోవుచునను విరివిగ బాంబులను వేయుచుండిరి. ఈకారణముచే అబిసీనియా సైనికులు కొంచెము వెనుకకు తగ్గవలసివచ్చెను. ఉత్తరమునుండివచ్చిన యిటలీ సేనలు రెండుమార్గముల అబిసీనియాలోకి ప్రవేశించెను. కొన్నిసేనలు అడిగ్రాటు మీదుగా ప్రవేశించినవి. వీరు అక్టోబరు ౫వ తేది నాటికి అడిగరాట్ అవపవరములను పూర్తిగ వశపరచుకొనిరి. ఒక్కట కొంచెము విశ్రాంతి తీసుకొనుచు నెమ్మదిగ ముందునకునడచి అక్సుంనగరమును వశపరచుకొనిరి దీనివలన అడోవనగరము చుట్టుప్రక్కల అక్సుం వరకు ప్రదేశము యిటలీవారి స్వాధీనమైనదనవచ్చెను. ఇప్పుడు యిటలీవారు ముందునకుపోవుటకు ముందు ఈ ౨౦ మైళ్లలోను మంచి సైనికపేర్పాటులు గావించుకొనుచున్నారు. ఇట్లు వీరు నెమ్మదించుటకు కారణము అక్సుమునగరమువద్ద కుండు లోయలలో నగత యీ అబిసీనియా సైనికులు దాగియుండుటయే. అడోవ, అడిగ్రాటు నగరములవద్దగాక ఇచ్చట లోయలలోయుండుటవలన అబిసీనియాకు ప్రక్కనుండి సహాయము కలిగినట్లగును, అదియుగాక అబిసీనియా సైనికులు వార్దిమొక సన్నాగము పన్నుచున్నారు, వారు ఇటలీసేనలను మూడువైపులను నిలువరించుకొని శత్రువులను వెనుకకు [illegible] చుచున్నారు. రాస్ సెయ్యంగారు [illegible] నతో ఆక్రమించినను. రాస్ సేయూం [illegible] ముందరివైపునను, మరకొన్ని సేనలు అడిగ్రాటు వైపునను (అనగా ముందు, కుడి, ఎడమ వైపుల) యిటలీసేనలను యెదిరింప ప్రయత్నములు జరుగుచున్నవి.

#### డానకీలు రంగము

అక్టోబరు ౩వ తేదినాడు మరికొందరు యిటలీ సైనికులు ఇరుత్రియాలోనుండి డానకిలు జిల్లాద్వారమున అబిసీనియాలోకి ప్రవేశించిరి. వీరికిని అబిసీనియా సైనికులకును ౭వ తేది రాత్రియంతయు తీవ్రపోరాటము జరిగెను. ౧౫౦౦మంది అబిసీనియావారు, 200 మంది యిటలీవారు యిచ్చట మరణించిరి

ఇట్లు వచ్చియిటలీసేనలు మొత్తముమీద ఒక వైమపుసాలి ప్రాంతమును వశపరచుకొనదలచియుండవచ్చును దీనినాపుటకై తగు ప్రయత్నములు చేయబడినవి. ఎట్లనేనను మవుసాలి ప్రాంతమును రక్షించవలయునని అబిసీనియా చక్రవర్తి పట్టుదల. ఇందుకై యతడు ౫౦ వేల మంది సైనికులనుపంపెను. ఇదిగాక ఈ అడిస్ అబాబీ రైలుమార్గముపై ప్రెంచివారికిహక్కు గలదు. ఇటలీ సైనికులు ఈ రైలుమార్గమునను క్కాడ పాడుచేతురోయని అడిస్అబాబ రైలు మార్గమునందు ముఖ్యసేనను అయినడిరేడావకు ౨౦౦మంది ఫ్రెంచిసైనికులుపంపబడిరి. అడిసు అబాబలోని బ్రిటిషు రాయబారవర్గము కార్యాలయమును హిందూదేశపు పంజాబిసేనలు కాపలాకాయుచున్నవి. నగరముపై బాంబులువేయబడునో నగరములోని బ్రిటిషు ప్రజలందరును ఈకార్యాలయములోనికి రావలెనని రాయబారి హెచ్చరించిరి. ఆ మేరకే సంబంధించిన ముందువైపు [illegible] పెద్దదిగ [illegible] ప్రభుత్వమువారుత్తరువులను జారీచేసిరి. మరియు తమసొత్తునకు నష్టము కలుగువిధమున బాంబులవేయరాదని ఆ పెరికోవారు ఇటలీ వారిని హెచ్చరించిరి. అడిస్ అబాబాలో విదేశీయ వర్తకులందరు చాలమంది అడిసుఅబాబ వదలిపోవుచున్నారు.

కొందరు అబిసీనియా సైనికులు ఎరిత్రియాలో ప్రవేశించి కొన్నినగరములను పట్టుకొనిరట. ఇదియు ఒక మంచి వుపాయమే. పైన చెప్పినట్లు అబిసీనియాసేనలు యిటలీ సేనలను మూడువైపుల ఎదిరించునప్పుడు వీరు వెనుకకు మరలి వారిని నాలుగవవైపున కూడ యెదిరించి నావతూడిన వీరికి గెలుపు సులభమగును.

#### ఒగడను రంగము

ఇకకొందరు యిటలీ సైనికులు అక్టోబరు ౩వ తేదిన దక్షిణమున యిటాలియను సోమాలిలాండులోనుండి అబిసీనియాలోనికిప్రవేశించిరి. ఇచ్చట యిరువాగలకు భయంకరమైన యుద్ధము జరిగెను ఇక్కడ ౨౦౦౦మంది అబిసీనియావారు మరణించినట్లు హరారునుండి తెలియవచ్చినది. ఇచ్చట ఒగడను నగరమువద్ద ఈయుద్ధము జరిగెను. అక్టోబరు ౭నాటికి డోలో, గొర్లగోబి నగరములను యిటలీవారు వశపరచుకొనిరి. ఈ ఒగడనువద్ద అబిసీనియా సైనికులు యిటలీవారిని వెనుకనుండివచ్చి తన్ని తరిమిచూచునప్పటికి పారిపోవుచున్నారు. అనగా పూర్వము హిందూదేశములో శివాజి మహమ్మదీయులను గెలుచుటకు చేసినయుద్ధము. దీనినే "గొరిల్లా వార్ఫేర్" అందురు. గతవత్సరము యిటలీవారివశమైన వాల్వాల్ నగరమును తిరిగి అబిసీనియావారు వశపరచుకొనిరి ఈవార్తవలన అబిసీనియావారు అమితోత్సాహ పూరితులైరి.

అడిసుఅబాబలోని యిటలీ రాయబారవర్గపు కార్యాలయము మిత్రులకు గూఢచారులకు ఆకరమని అబిసీనియానుండి వెళ్లిపొమ్మని యిటలీరాయబారికి అబిసీనియా ప్రభుత్వ మాత్తరువు చేసినది. వెళ్లిపోవుటకు ముందు కోరబడిన రక్షకదళమునుగూడ నిరాకరించబడెను. అడిసు అబాబపై బాంబులు పడకుండ చేయుటకై నగరవీధులలో రాత్రిళ్లు దీపము పెట్టకుండుటకును, యిండ్లయందలి దీపములు బయటికి కనబడకుండునట్లు పెట్టవలెననియు, రాత్రిపూట మోటారులు పెద్దదీపములతో తిరగకూడదనియు ఉత్తరువులు జారియైనవి.

అక్టోబరు ౧౧వ తేదినాడు రాత్రి ౧౦ గం. రహాని లకు జారీచేసిన రూటరు వార్తలో అబిసీనియాలో ఒగాడెన్ రాష్ట్రముయొక్క గవర్నరగు రాస్ నసీబుంగారి సేనలు అక్టోబరు ౧౦వ తేదిరాత్రి ౮ గం.లవేళ అడోవాను ఆక్రమించుకొనియున్న యిటలీ సేనలపై దాడిచేసి, ఆ నగరమును ముట్టడిచేసి దానికి కావలియున్న ఇటలీయులను సుమారు ౨౫౦౦ మందిని పూర్తిగా ఖైమాచేసినట్లున్నది. ఇట్లు ఖైమాచేసి వారు వేలకొలది రైఫిళ్లను, మెషీనుగన్నులను, తేలిక ఫిరంగులను, లక్షలకొలది తూటలను ఉపయోగించగల మందు సామగ్రిని వశపరచుకొనిరి. రాత్రి౧౦గంటలవేళ చీకటిమూలమున అబిసీనియా సైనికులు హఠాత్తుగా దండెత్తివచ్చుటచే అడోవాను ఆక్రమించుకొనియున్న యిటలీ సేనలకు సంభ్రమము కలిగెను. కాని యిటలీసేనలు శౌర్యముతో పోరాడెను. అబిసీనియా సైనికుల సంఖ్య యిటలీసైనికులసంఖ్యకంటె కొంచెము యెక్కువగా నుండెను. ఈ ధైర్యముతో అబిసీనియా సేనలు బల్లెములతోను, కత్తులతోను శత్రువులను తెగించిపోరిరి. అబిసీనియా సైనికులు కొందరు మరణించిరట, ఇటలీసేనలు మరల దండెత్తి జూచుచున్నవి. మరలదండెత్తినచో యెదిరించుటకు అబిసీనియా సైనికులు గట్టియేర్పాట్లను చేయుచున్నారు.

కాని అబిసీనియా సైనికులు అడోవానుయెదిరించినవార్త రోముతో యిటలీ ప్రభుత్వమునకు రానేలేదట. అందుచేత అడోవాను అబిసీనియావారు మరల స్వాధీనపరచుకొనిరను వార్త పూర్తిగా నిరాధారమైనదని యిటలీ ప్రభుత్వమువారు ప్రకటించినారు.

అక్టోబరు ౧౧వ తేది ఉదయం ౭ గం. ౪౫ ని.లవేళ అడోవాకు దక్షిణమున ఇటలీ అబిసీనియా సైనికులకు యుద్ధము జరుగుచుండెను. రాస్ సేయం, లాస్ కాసాగార్లు సేనను యిటలీసేనల బెదరించుచుండెను. ఇటలీ సైనికులను ముందుకు సాగనీయకుం

౪ వ పేజి చూడుడు

[illegible]

## గొల్లలు ముమ్మాటికి యాదవులే

భావకవి రామమూర్తి పంతులుగారు తేనబుడికితో చిన్నట్లు గొల్లలు యాదవులుకారు వారు కేవలము శూద్రులని పదేపదే వ్రాయుచున్నారు. శ్రీమద్భాగవత మందలి దశమస్కంధములో "వసుదేవ ఉపశ్రుత్య భ్రాతరం నందమాగతం" అని వసుదేవునకు నందుడు భ్రాతయని చెప్పబడియుండుట వలనను, యదువంశమునందలి దేవమీఢ మహారాజునకు గుణవతియందు శూరునకు వసుదేవాదులును, మఱియొక కుమారుడగు పర్జన్యునకు నందాదులు బుట్టినారు గనుక నందుడు క్షత్రియుడని స్పష్టమగుచున్నది" అని శ్రీ దుగ్గావఝల శర్మ సామవేది గారు వ్రాయుచున్నారు. ఈ కారణము వల్లనే వసుదేవుడు తన కుమారుడగు కృష్ణచంద్రుని నందుని గృహములో వర్ధిల్లజేసెను.

క్షత్రియుడైన దిలీపుడు వశిష్ఠుని హోమధేనువును గాచినట్లు రఘువంశములోను, క్షత్రియుడైన సహదేవుడు విరాటుని గోవులను గాచినట్లు మహాభారతములోను, క్షత్రియుడైన శ్రీకృష్ణచంద్రుడు గోవులను గాచినట్లు శ్రీమద్భాగవతములోను వర్ణింపబడి యున్నది. కాబట్టి క్షత్రియోచిత ధర్మములలో గోపాలన మొకటియని స్పష్టమగుచున్నది. యదు వంశమునందు బుట్టి క్షత్రియోచితమైన గోపాలన మొనర్చిన నందుని కులమునందు బుట్టిన వారగుటచే గొల్లల మందరమును క్షత్రియులమే గాక ముఖ్యముగా యాదవులము.

గొల్లల ధనమునకు "యాదవం" అని పేరున్నట్లు అమరకోశమునకు వ్యాఖ్యానమైన గురుబాల ప్రబోధికలో నిర్ణయింపబడి యున్నది "గోమహిష్యాదికం ధనం" అను వాక్యములో "ఆది" అనగా గాడిదెలు, మేకలు, గొఱ్ఱెలు అని రామమూర్తి పంతులుగారు సెలవిచ్చుచున్నారు. గొఱ్ఱెలను మేకలను గాచువారికి వేఱేపేరిడి వారిని శూద్రవర్ణములో అనుపిహ్యుడు చేర్చియున్నాడు కాబట్టి "ఆది" శబ్దము మేక గొఱ్ఱెలకు అన్వయింపదు. గోమహిషి సంబంధమైన పాలు, పెరుగు, వెన్న మొదలైనవానికి అన్వయించును. ఎందుకనగా భాగవతములో నందుడు కంసునకు కప్పము తీసుకొనిపోయినపుడు ఈపాలు, పెరుగు, వెన్న, మొదలైనవే వర్ణింపబడి యున్నవి అమరసింహుడు కూడ మమ్ములను శూద్రులలో చేర్చలేదు. మాధనమునకు "యాదవం" అను పేరుండుటవలన మేము యాదవులముని దప్పక ఒప్పుకొనవలసి వచ్చునేమో అనుశంకయను చే"గోమహిష్యాదికం, యాదవం ధనం ద్యోగవిష్వ తే"

అనుదానిలో యతిభంగము కలిగినది కాబట్టి ఇది అమరసింహుని పాఠముకాదని భావకవి రామమూర్తి పంతులుగారు చెప్పసాహసించిరి. "వ్యవాయో గ్రామ్యధర్మో మైథునం నిధువనం రతం" అని అమరములో నున్నదే. ఈయతిభంగమును పంతులుగారు ఎట్లు సమర్థించెదరో తెలియకున్నది. ఇట్టివి ఎన్నియో యతిభంగములు కలవు. ఇంత మాత్రముచే ఇది అమరసింహుని పాఠముకాదని చెప్పుటకు వీలులేదు.

నాగరలిపి గ్రంథములలో "యాదవంధనం" అనుమాట తాను చూచినంతవఱకు లేదని పంతులుగారు వ్రాసియుండిరి. గురుబాల ప్రబోధిక మొదలగు గ్రంథములకు వ్యాఖ్యానముం జేసిన గొప్ప పండితులు నాగరలిపిలో లేనిదానిని "యాదవం ధనం" అను పాఠాంతర మున్నదనిన్ని, గోమహిష్యాది ధనము "యాదవంధనం" అనగా యదువంశ క్షత్రియులకు చెందినధనమని పేరనిన్ని వ్రాయుచు గొల్లలను యాదవులుగా నిరూపించుచుండ ఈ భావకవి రామమూర్తి పంతులుగారికి కనబడక పోయినంతమాత్రముచేత ఈ పాఠము నాగరలిపిలో లేదని చెప్పుటకు వీరెట్లు సాహసించిరో తెలియకున్నది. "యాదవం ధనం" అను పాఠాంతరము తెలుగులిపి గ్రంథములలో ఉంటే ఉండవచ్చునని కూడ పంతులుగారు తమ భావన వెల్లడిచేసిరి. అలు అనే యున్నచో వ్యాఖ్యానము జేసినపండితులు తెలుగులిపి గ్రంథములలో నున్నదని వ్రాయవలెను. భావకవి రామమూర్తి పంతులుగారి అభిప్రాయ ప్రకారము వ్యాఖ్యానము జేసినవారందరు నాగరలిపిలోని పాఠములను జదువని వారలని తేటపడుచున్నది. పంతులుగారికి వ్యాఖ్యాన కర్తలయందుగూడ విశ్వాసములేదని స్పష్టమగుచున్నది.

భావకవి రామమూర్తి పంతులుగారు తనకు తెలిసినంత, పెద్దలవలన విన్నంత నిష్పక్షపాతబుద్ధితో ఈ విషయమును చర్చించేవారని వ్రాసికొనియుండిరి. పైన నాచే నుదహరింపబడిన విషయముల వలన పంతులుగారు సత్యమును గ్రహించువారు కారనియు కేవలము గొల్లలపై తనకుండు అసూయను వెలిబుచ్చుకొనుటకై వారితో వాద వివాదములకు బూనుకొనిన వారనియు చదువరులకు గోచరము కాకపోదు. రామమూర్తి గారి నామమునకు "పంతులు" అనిజేర్చియుండుటం జూడ వారు బ్రాహ్మణులనిం దోచుచున్నది. మేము పంతులుగారి బ్రాహ్మణత్వమును గోరలేదే. వారికి మాయందు ఇంత అసూయ ఎందుకు కలుగవలెనో తెలియకున్నది. ఒక పర్యాయము మనస్సులో అసూయ ప్రవేశించి పని జేయుటకు బ్రారంభించిన యెడల ఆ మనస్సునకు సత్యమును గ్రహించుటకు అవకాశము గలుగునా? ఎప్పటికి కలుగనేరదు. ఇంతవఱకే గొల్లలు యాదవులని పరిశోధనలుంజేసి కృష్ణాంతములు జూపుచు వ్రాసిన గ్రంథము లనేకము లుండె ఈ విషయమై యథార్థము గ్రహించవలెనని కుతూహలముతో నున్న పంతులుగారు అట్టి గ్రంథముల నెల్ల చదివి తెలిసికొనవలెను. కాబట్టి పంతులుగారితో వాద వివాదములు పెంచుటచే కేవలము మా అమూల్యమైన కాలము వ్యర్థ మగుచున్నదని నా ముఖ్యాభిప్రాయము. రామమూర్తి పంతులుగారు మానుండి ఏవిధమైన ప్రత్యుత్తరము నిరీక్షించ కూడదనియు, వారు నిరీక్షించినను వారికి ఇప్పటినుండి ప్రత్యుత్తర మివ్వమనియు వారు తెలుసుకొందురుగాక. ఈ విషయమై విపులముగా తెలుసుకోవలసి యున్నచో, యదువంశ ప్రదీపిక, యదుకుల సర్వస్వము, అహీర్ వంశప్రదీప్, మొదలైన గ్రంథము లనేకములు వ్రాయబడియున్నవి. కాబట్టి వానిని పఠింపుడని పంతులుగారితో మనవిజేయుచున్నాను. మేము ముమ్మాటికి యాదవులమే యని మఱియొకసారి యొత్తి చెప్పుచు ఇంతటితో విరమించుచున్నాను.

ఇట్లు
పోలం వీరమల్లయ్య యాదవ
హైదర్ ఖాన్ వీధి
సికింద్రాబాదు.

౫-౧౦-౩౫

---

మధిర తాలూకా తహసీల్‌దారు నాగారి ఔదార్యము.

మహారాజరాజశ్రీ దుర్గయ్య తహసీలుదారు సాహెబు, తాలూకె మధిరగారు మా తాలూకాకు వచ్చి నేటికి అందాజా మూడుసంవత్సరములు అయినది. ఔదార్యము వర్ణనాతీతము. వీరుహిందూ ప్రభువులు. రయితులయొక్క కష్టనిష్ఠురములు, న్యాయాన్యాయములు, మిక్కిలి దయార్ద్ర హృదయముతో, పరిశీలించిపరిపాలించుచున్న వారలు. వీరు మాతాలూకాకువచ్చినదాది రయితులు యావన్మంది సంతోషముతో, సుఖముగా వుంటూవున్నవారలు. నేటివరకు ప్రతిరయితు లెవ్వరు, మా దొరగారి ఔదార్యమను పొగడుచు వేరొకరని నష్టపెట్టిరని కష్టము వెలిబుచ్చువారొక్కరును గనిపించుటలేదు. వీరే యెల్లప్పుడు మాతాలూకాలో నుండుటకు ప్రభుత్వమువారు నియమించినట్లయిన మేమునెంతయు కృతజ్ఞులము. వీరికి భగవంతుడు అధికారాభివృద్ధియు ఆయురారోగ్యము నొసంగుగాతయని సదా ప్రార్థించుచున్న వారలము.

ఇట్లు
వేమిశెట్టి అనంతరాయగుప్త తల్లాడ.
తంతిఅడ్రసు —"సంఘాయి"

---

# స్థానిక వార్తలు

## పట్టుబట్టలనేత కార్ఖానా

నగరమున ఒక కార్ఖానా త్వరలో స్థాపింపబడుననియు దీనిపేరు "హైదరాబాదు సిల్కుమిల్సు లిమిటెడు" అని కంపెనీల ఖానూనుప్రకారము రిజష్టరీ చేయబడినదనియు తెలియుచున్నది.

## గైడుం క్లబ్బు

౭ అజూరు నాడు సాయంత్రము ౧౧ ౪॥ నేళ రాకుమారి దురుషహవరు, దుర్రానా బేగముగార్ల యాజమాన్యమున నగరములోని రెసిడెన్సి తోటలో ఈవినోదములు జరుగును. పద్ధ ఏర్పాటులు బాగుగా చేయబడినవి.

## యునాని వైద్యుల చరిత్రము

మ. ఘ. వ. ప్రభువుగారి రజతోత్సవ సందర్భమున ఈవైద్యులచరిత్ర మొదలగు వివరములు పుస్తకరూపమున ప్రకటించుటకు యూనాని వైద్యసంఘమువారు నిశ్చయించియున్నారు. రజబునెల అంతములోపల అట్టివైద్యులచరిత్రలు పంపవచ్చును.

## కరోడ్గిరి క్రొత్త ఏర్పాట్లు

కరోడ్గిరి నాజముగారొక క్రొత్త స్కీమును ప్రభుత్వము వారి కంపియున్నారు. అదిత్వరలో అంగీకరింపబడును. ఈవిషయమును వివరించుచు, సరిహద్దులమీద కరోడ్గిరి ఏర్పాటులు చురుకుగా జరుగుటకై ప్రత్యేకపద్ధతులు నిర్ణయించి, ఒకగస్తీ జారీచేసియున్నారు.

## గ్రామ పునర్నిర్మాణము

కరీంనగరముజిల్లా, మహదేవపురము తాలూకాలోని కన్నారం గ్రామమున ఈమధ్య గొప్ప సభజరిగినది. తహస్సిలుదారు, ఇతర అధికార అధికారేతరులు అచ్చటకువెళ్లి జనులకు గ్రామపునర్నిర్మాణవిషయములు బోధించిరి. గ్రామఫోను పాటలు వినిపించిరి. గ్రామఫోనుద్వారా నాటకప్రదర్శనమువిని జను లానందించిరి.

## మైలతుత్తము ప్రయోగించిచంపజూచుట

కార్వాను బజారులో నివసించు ఒక ముసలమ్మను అయిదేండ్ల బాలికయొకతె మైలతుత్తము ఆహారములోపెట్టి చంపనుద్దేశముతో చేసిన ప్రయత్నము బయటబడెను. ఆహారము తిన్నతరువాత నార్దరకీ వాంతులై విషము బయటపడెను. బాధితులను వైద్యశాలకంపిరి. ఆరోగ్యము కలిగినది. ఈనేరము ఒకయువతి పదిసంవత్సరముల బాలికద్వారా చేసెనట!

## ప్రభువుగారి మనుమని జన్మోత్సవము

మ. ఘ.వ. ప్రభువుగారి మనుమని జన్మోత్సవము ౪ అజూరునాడు జరుపబడుననియు, "చెన్నమస్తాన్" మందిరమున విందుజరుగుననియు తెలియుచున్నది.

## రజతోత్సవ దినములు మారుట

### మ.ఘ.వ. ప్రభువుగారి ఫర్మాను

ఇదివరలో మ.ఘ.వ. నిజాం ప్రభువరేణ్యు డొసగిన ఫర్మానుననుసరించి రజతోత్సవము రాబోవు డిసెంబరునెలలో కడపటి ౪ రోజులు జనవరి నెలలో మొదటి ౩ రోజులును (అనగా షవ్వాలు ౧౩౫౪ హిజ్రి) జరుగవలసియుండెనుగదా! ఇప్పుడు అనేక కారణములచే ఆయేర్పాటునుమార్చి ౧౯౩౬ సంవత్సరము ఫిబ్రవరి కడపటి ౪ రోజులును, మార్చి మొదటి రెండురోజులును (అనగా ౧౩౫౪ హిజ్రి జిలహిజ నెల మొదటి వారములో) ఆమహోత్సవము జరుగవలసినట్లు మ.ఘ.వ. ప్రభువుగారు ఫర్మానుద్వారా ఆజ్ఞాపించినారని ప్రభుత్వప్రకటనశాఖవారు తెలుపుచున్నారు.

## ప్రభుత్వశాఖల నివేదికలు

ప్రభుత్వము వారివివిధశాఖలవార్షిక నివేదికలు చాల ఆలస్యముగా అనగా రెండుమూడుసంవత్సరములు దాటినతరువాత వెలువడుచున్నవనియు, అట్టినివేదికలు లన్నిపత్రికలకు క్రమముగా పంపబడుచుండలేదనియు, కొన్నిశాఖల నివేదికలు ఇంగ్లీషులో ప్రకటింపబడుట పరిహాసాస్పదమనియు, ఈలోపముల నివారించనిచో నివేదికల ప్రకటించుట నిరుపయోగమనియు "సుబహెదక్కన్" పత్రిక [౨౭-౧౦-౩౫] వ్రాయుచున్నది.

## ముసలిదాని ఆత్మహత్య

గత ఆదివారము వుదయము సుల్తానుబజారు పోలీసువారు అచ్చటి మార్కెటువద్ద నొకబావిలో తేలుచుండిన ముసలిదాని శవమును బయటికితీసిరి. ఈచావునకు కారణమరయగా, ఆముసలిదానిని తన ఒకే ఒక కొడుకు చాల ఏండ్లక్రిందట వదలిపెట్టి పోయెననియు, అప్పటినుండియు తను బిచ్చమునెత్తి జీవించుచుండిననియు, ఈ దిక్కు-మాలిన స్థితి ఆమెను ఆత్మహత్యకు పురికొల్పెననియు తెలిసెను.

## అన్నదానము

శ్రీశ్రీ మహాఘనత జెందిన మన నిజాం ప్రభువారి జన్మదినమహోత్సవ సందర్భమున మా సంతోషమును కనబరచుటకై ౨౦ రజబ్ సన్ ౧౩౫౪ హిజరి సోమవారం వుదయము ౯ గంటలకు యజమాని నిజాంసోఫు కొరుఖానాగారు ౧౫౦ బీదలకు అన్నదానము చేసినారు.



## నిజాంరాష్ట్ర ప్రజా సభ కార్యదర్శి పదవికి రాజీనామా

### మౌ. సయ్యద్ అబీదు హుసేనుగారు సమర్పించుట

"జమియ్యు తెరయాయాయె నిజాం" అనుపేర నొకసంఘము కొంతకాలముక్రింద స్థాపింపబడియుండెను. దానికి తాత్కాలిక కమిటీమాత్రము ఏర్పడియుండెను కదా. దాని కధ్యక్షుడు రాజకీయ శాఖకు పూర్వము మంత్రిగానుండిననవాబునిజామతు జంగ్ బహదరు, కార్యదర్శి మౌ. సయ్యదు అబిదుహుసేను అనువారు. ఈ కార్యదర్శిగారటీవల తమ పదవికి రాజీనామా ఇచ్చుకొనుచు ఇట్లు ప్రకటించినారు.

"నేనువ్రాసిన "విథర్ హైదరాబాద్" అను పుస్తకమును సర్కారువారు జప్తుచేసికొనిననాటినుండియు, నిజాంరాష్ట్ర ప్రజా సంఘము యొక్క హితైషులగువారు, నా సంబంధము ఆ సంఘముయొక్క కార్యదర్శిగా నుండుట సంఘాభివృద్ధి కనుకూలముగా నుండదని సూచించియుండిరి. అందువలన, పై సంస్థయొక్క క్షేమమును దృష్టియందుంచి తాత్కాలిక కమిటీయొక్క కార్యదర్శిత్వమును వదలుకొనుచున్నాను."

## క్రొత్త మోటారు సర్వీసు

మౌలాలీగుట్ట ఉరుసు సందర్భమున అనుకూలముగా నుండుటకై ౧౨ రజబునాడు ఉదయము ౧౦ గంటలనుండి రాత్రి ౧ గంటవరకు పురానీ హవేలీనుండి మోటారు సర్వీసుయొక్క ఏర్పాటు చేయనైనది. కిరాయ మనిషి ఒక్కంటికి పావలా.

## బిజిలీ తీగెవల్ల చావు

జబ్బున్నా రిసాలాలో ఒక కూలివాడు ఇల్లు కట్టుచుండగా బిజిలీ తీగె తాకి తలయును చేయియు తీగెకు అంటుకొని పోయెను. ఎంతో కష్టముపైన తీగెలు తొలగించి వైద్యశాలలో ప్రవేశపెట్టిరి. కాని తుదకాతడు చనిపోయినాడు.

## ప్రధాన మంత్రిగారు తిరిగివచ్చుట

సామనగరమునకు వెళ్లియుండిన మన ప్రధాన మంత్రిగారు తిరిగివచ్చిరి.

## బోర్డుల పైన ప్రభువుగారి బిరుదముల నిషేధాజ్ఞ

### రాజవంశీయుల బిరుదములుకూడ నిబంధించుట

దుకాణములవారు తమ బోర్డు మొదలగువానిపైన ప్రభువుగారిపేళ్లు బిరుదములు, కిరీటము, రాకుమారుల పేళ్లు, బిరుదములు మొదలైనవి వ్రాసికొనుచున్నారు. కనుక ఇది కూడదనియు అట్టివానిపైన ఏవిధముగానైనను రాజవంశము వారిపేళ్లుగాని, బిరుదులుగాని, పటములుగాని ముందు ప్రభువుగారి అనుమతిలేనిది వ్రాయగూడదని నిషేధింపబడినది.

## రైలు టికట్లమీద ఉర్దూ వ్రాత

ఉత్తర హిందూస్థానములోని మహమ్మదీయ పత్రికలు, నిజాంరాష్ట్రపు రైలు టికట్లపైన ఉర్దూవ్రాత లేనందునకు చాల విచార పడుచున్నవనియు, ఇది రైలు అధికారుల నిర్లక్ష్య స్వభావమును, మర్యాదను అనియు, ప్రభుత్వము వారు వీరిని మందలించవలయుననియు, టికట్లు ఇచ్చటి ముద్రణాలయములో అచ్చువేయించక, లండనులో అచ్చువేయించుట విచారకరమనియు వ్రాయుచున్నవని రహబరెదక్కన్ పత్రిక పక్కాణించుచున్నది.

## హైదరాబాదుకు జపాను కవి ప్రముఖుడు

### ఉస్మాను విశ్వ విద్యాలయమువారి ఆహ్వానము

టోకియోలోని కీయోగిజుకు విశ్వ విద్యాలయమునందాచార్యుడును, ప్రసిద్ధ కవియునగు యోన్ నాగుచి అనునతడు హైద్రాబాదులోని ఉస్మానియా విశ్వ విద్యాలయమువారి ప్రాపకముక్రింద డిసెంబరు ౨౦ వ తేదినుండి కొన్ని వుపన్యాసముల నిచ్చునట్లు టోకియోలోని పైకొప్పిన విశ్వ విద్యాలయాధికారులు బులెటిన్ పత్రిక వారికి తెలిపిరి. వారు కలకత్తాకు నవంబరు ౧౫ వ తేదిన వచ్చి, అచట జపానువారి పద్యవాఙ్మయము-కళ అనుదానినిగూర్చి కొన్ని ఉపన్యాసముల నిత్తురు. పిమ్మట నాగూచిగారు హైద్రాబాదుకువచ్చి తదనంతరము మద్రాసు వెళ్లుదురు.

మొదటిపేజి తరువాయి

డ అబిసీనీయులు ధైర్యముతో అటంకపరచుచుండిరి

అబిసీనియా ప్రభుత్వమువారు గావించిన యొక ప్రకటన నిజమగునో, తూర్పు సరిహద్దు అవద్దనున్న డిమెడోరా నగరముయొక్క సమీపములో ఇసా తెగవారు ఒక ఇటలీ విమానముపై తుపాకులుపేల్చి దానిని క్రిందికిదింపి ధ్వంసము చేసిరట

ఒగడెన్ రాష్ట్రములో అబిసీనియా సైనికులు ఉలావల్, వార్డెర్ నగరములను స్వాధీనపరచుకొనిరట.

## ముందు కార్యక్రమమేమి?

అక్టోబరు ౧౧ వ తేది నాటి రోమునుండి వచ్చిన రూటరు వార్తవలన తెలియు మరొకయంశమేమనగా, యిటలీ సేనలు యిక ౧౫ కోసులవరకు ముందుకు నడవక యింతవరకు పట్టుకొన్న ప్రదేశములను మరల వశము తప్పకుండునట్లు కట్టు దిట్టములను చేసికొనుచుండెదరట. ఒగడెన్ రాష్ట్రములో యిటలీసేనలు ముందుకు నడచుటలేదు. డానకిల్ రంగములో యిటలీ సైనికులు మోసాలి ప్రాంత్యమందే నిలిచి యున్నారు. కాని అదే తారీఖునాడు జిబౌటి నుండివచ్చిన రూటరు వార్తవలన అడిస్అబాబి రైలు మార్గమును స్వాధీన పరచుకొనుటకు కొన్ని యిటలీసేనలు మూడు దళములుగ చీలి, వచ్చుచున్నవనియు, ఈ దళములు హరారునగరమునకు ౩౦ మైళ్లదూరములో నున్నవనియు తెలియుచున్నది. ఇటలీ సైనికులు రైలుమార్గమును వశపరచుకొను స్థితియేర్పడినచో అబిసీనియావారే రైలుమార్గమును తెగగొట్ట వచ్చుననియు, డానకిల్ రంగములో ఇటాలీయులు అస్సాబుపైపు ముందుకు నడచుచున్నారనియు, కాని యిదివరకే అబిసీనియావారు అక్కడిబావులలో ఉప్పు కలుపుటచే యిటలీయులకు చాల కష్టము కలుగుచున్నదనియు కూడ ఆవార్త తెలుపుచున్నది. అబిసీనియా సేనలు అస్సాబును యెదిరించిరని అస్మారానుండి వచ్చిన యొక వార్త. ఈ అస్సాబ్ ఎరిత్రియాలోనే ఫ్రెంచివారి సోమాలిలాండుకు సమీపములో నున్నది. అదే అస్మారా వార్తలో అడోవా నగరమునకు అబిసీనియా సరిహద్దునకును మధ్యనుండు ౨౦ మైళ్ల వెడల్పున్న ౫౦ మైళ్ల లోతున్నగల లోయ ప్రదేశమును తమ వశముమండి జారిపో

ఖండ సంరక్షించుటకు యిటలీ సేనలు గట్టికట్టు దిట్టములు చేయుచున్నవనియు, కొన్నివోట్ల సంరక్షకులను పంపగా వారలకుఅబిసీనియావారు యెదురు తిరిగిరనియు, మాకళెదగ్గరయిూ ప్రతిఘటన యెక్కువగ నున్నదనియు తెల్పబడినది

## ఉపాధ్యాయుల సభ

౧౧ అజూరునుండి నిజాం రాష్ట్ర ఉపాధ్యాయుల సభ జరుగనున్నది. అధ్యక్ష సంభాధ్యక్షుడు శ్రీయుత సుందరము బి. ఏ. గారు. చాల ఉత్తమ విద్యా విషయములు చర్చించబడును.

ఉమూరె మజహబి మోతమది స్థలపు మార్పు

ఈ కార్యాలయము హోం సెక్రటరీ లోనికి మార్పబడినది

ఫతే మైదానములో సైనిక ప్రదర్శనము

మ ఘ న ప్రభువుగారి మనుమడగు మొకర్రంజాహిగారి జన్మోత్సవ సంవర్భమున ఫతే మైదానములో ప్రదర్శనము జరిగినది. మ.ఘ.న. ప్రభువుగారును, శ్రీశ్రీ రాణీగారును, యువరాజ దంపతులును, రాకుమారులు, రాకుమారితలు దయచేసి ప్రజలకు నేత్ర పర్వ మొనర్చిరి.

నగర కోత్వాలు గారి క్రొత్త వాయిదము

పోలీసు ఉద్యోగులందరు క్రమశిక్ష నిలుపుటకై నవాబు రహమతుయార్జంగు బహాదరుగారు కొన్ని క్రొత్త నియమము లనుచేసి ప్రకటించి యున్నారు

నాంపల్లి ఫుట్బాల్ పోటి

ఇచ్చట ఫుట్బాలు పోటి జయప్రదముగా జరిగినది. నాంపల్లి విద్యార్థులజట్టును పోలీసుజట్టుతో పోటీజరిగినది. రెండవపోటీ పరంగల్లువిద్యార్థులతో జరిగినది. ఆసందర్భమున సర్కారీఅధికారులందరును వచ్చియుండిరి. నాంపల్లి జట్టు ఓడిపోయినది.




దేవదాస్

## దసరా వేడుకలు

( కలం )

ఆంధ్ర యువజనసంఘము తరఫున విజయదశమిరోజు సాయంత్రము ౬॥ గంటలకు శ్రీబాలసరస్వతి ఆంధ్రభాషా నిలయంలో దసరావేడుకలు జరుపబడెను. శ్రీయుత శాంతిపరిపక్ష్మగారి వీణాగానము సభికుల నిజముగా ఆనందపరచినది. శ్రీయుత సత్యనారాయణగారు హిందూస్థాని పాటపాడి సభికుల మెప్పువడసిరి. కృష్ణమాచార్యులవారు కరతాళధ్వనుల మధ్య పద్యగానము గావించిరి.

అంత పై సంఘపు అధ్యక్షులు కృతజ్ఞతా వందనము లర్పింప సుమారు ౭ గంటలకు వేడుకసభ ముగిసెను.

### ఉస్మానియా పట్టభద్రుల సంఘ కార్యదర్శికి మున్సిఫ్ పదవి

పై సంఘమునకు కార్యదర్శియగు ఫియాజుద్దీన్ అహ్మద్, బి. ఏ., యల్. యల్. బి., గారు మున్సిఫ్ గా నియమితులైనందున అబ్దుర్రహీము బి. ఏ., గారు కార్యదర్శిగా నియమింపబడిరి.

### చెరువులో మృతుని శరీరము

చారము రోజుల క్రింద శనివారము నాడు ౩౦ ఏండ్ల వయసుగల నారాయణ అనువతని కళేబరము మీరు ఆలం చెరువులో తేలుచున్నట్లు కనుగొనబడెను. పోలీసు వారా శరీరమును చెరువులోనుంచి తీసివేసిరి. అతడు ప్రమాదవశమున మునిగియుండునని అనుమానించబడుచున్నది.

### వైదికాదర్శ

హైదరాబాదు ఆర్య సమాజము వారిచే నడుపబడుచుండు "వైదికాదర్శ" అను ఉర్దువారపత్రికకు మ. ఘ. వ. ప్రభుత్వమువారిచే నింతవరకు యివ్వబడిన అనుజ్ఞ నిరాకరించబడెను.

## ఆర్థిక మంత్రిగారి నైపుణ్యము

### మ. ఘ. న. ప్రభువుగారి సంతసము!

నవాబ్ హైదరు నవాజజంగుగారు చాల నైపుణ్యముతో ఆదాయ వ్యయపట్టిక [మహిజనా]ను ౧౩౪౫ ఫసలికొరకు తయారు చేసినందునకు మ. ఘ. వ. ప్రభువుగారు నవాబుగారి విషయమునను, వారి క్రింది యుద్యోగుల విషయమునను తమ సంతోషమును ప్రకటించిరి.

### చిత్రగుప్త బాలభటులు

కాయస్థ యువజన సంఘము పక్షమున దసరా సందర్భమున రాజాబహదరు వేంకటరామారెడ్డి ఓ. బి. ఇ. గారి యాజమాన్యమున బాలభటుల సభ జరిగినది. వీరి యధ్యక్షులగు రాజానరసింగరాజా బహదరు, రాయ సజ్జురు ప్రసాదు [హైకోర్టు వకీలు]గారు, సత్యనారాయణ ప్రసాదుగారు మున్నగు సభా నిర్వాహకులు వయస్థచేసియుండిరి. ప్రభువుగారికి ఆశీస్సులతో సభముగిసెను.

### శాసన సభా సభ్యత్వకాలము హెచ్చించుట

నవాబ్ ఖుల్లుజమాను ఖాన్ గారి సభ్యత్వము మరి రెండు సంవత్సరములు వరకు పొడిగింపబడినది.

## గోల్కొండవరకు సర్కారి బస్సులు పోవు యేర్పాటు

౧ ఆజూరునుండి గోలకొండవరకు రైల్వే బస్సులు పోవుచు వచ్చుచుండునట్లు ఏర్పాటు చేయబడినవి. దివాన్ దేవిడినుండి గోల్కొండవరకు రెండణాలు, సాతవం తెనవరకు అణా అని నిర్ణయించబడినది. ఉదయము ౧౦-౪-౧౫ నుండి రాత్రి ౧౦. ౯-౩౦ వరకు ౩౦, ౩౦ నిమిషాల కొకసారి చొప్పున బస్సులువచ్చుచు పోవుచుండును.

## హైదరాబాదు ఆర్థిక సంఘసభ

ఇది ౫ ఆజూరు ౧౩౪౫ ఫ. శుక్రవారమునాడు సాయంత్రము ౪॥ గంటలవేళ నిజామకాలేజి ప్రక్కనున్న సహకారసంఘ కార్యాలయమున జరుగును. ప్రారంభోత్సవము నవాబ్ హైదరు నవాజజంగు బహదరుగారు జరిపెదరు. "రైతుల ఋణబాధ"ను గురించి అహమదు మొహియుద్దీను సా॥ ఉపన్యసించెదరు.

## గ్రామములలో ప్లేగు

సంగారెడ్డిపేటలో ప్లేగువ్యాధి వ్యాపించుచున్నదని తెలియుచున్నది. డాక్టరుఖానా కూడ ఏర్పాటు పెట్టబడినది. జనులు భయభ్రాంతులై యున్నారు.

అంకోలుతాలూకా ఆల్లామర్గములోకూడ ఎలుకలుపడుచున్నవి. జనులు భీతచిత్తులై ఇండ్లు ఖాళీచేయుచున్నారు.

## గాంధి జయంత్యుత్సవము

(విలేఖరి)

౨వ ఆక్టోబరునాడు సాయంత్రము ౬॥ గంటలవేళ గౌలిగూడెము నందు, దేశభక్త వామన నాయకుగారి భవనమున నీ యుత్సవము జరుపబడినది. బహిరంగసభకు సెలవు దొరకనందున ప్రైవేటు సమావేశము జరిగినది. సుమారు ౩౦౦ మంది విద్యార్థులు వచ్చియుండిరి. వీరిలో నగరమున ప్రజాహిత కార్యములందు ప్రముఖులు. శ్రీ నాయకుగారి కుటుంబమునకు సంబంధించిన మహిళా మణులను కూడ దయచేసియుండిరి.

మహాత్ముని పెద్ద పటము ఒకపక్క నిలుపబడియుండెను. దాని యెదుట పీఠముపైన రెండుజ్యోతులు శోభాయమానముగ వెలిగింపబడినవి. కార్యక్రమము ఆరంభమున గాంధీమహాత్ముని కిష్టమైనదగు గీతము "వైష్ణవ జనతో" అనుదానిని శ్రీమతి ముక్తాబాయి (దే. భ. వామన నాయకుగారి పత్నిరత్నము) గానముపాడిరి. తరువాత మౌ. సిరాజుల్ హసన్ సిర్మిజీ సా॥, హైకోర్టు వకీలు, మహాత్ముని జీవితములోని ముఖ్యాంశములను వర్ణించి ఆపవిత్రాత్మకు దీర్ఘాయువు కలుగవలయునని అందరి పక్షమున ప్రార్థించిరి.

పిమ్మట దే. భ. వామన నాయకుగారు గాంధివారమున చేసిన ఖద్దరు విక్రయమును గురించియు, హరిజనోద్ధరణమునకై సంపాదించిన చందాలను గురించియు వివరములు తెల్పి చందాలొసంగినవారి ఘననామముల తెల్పిరి. మూడువందలకు పైగా చందాలు వచ్చినవి. నగరములోని హరిజన వసతిగృహమునకు చందా లొసగిన మహమ్మదీయ సోదరులు మౌ. మి. మెహదీ సా॥ (బొంబె బాంకుమేనేజరు కార్యదర్శి), మౌ. తారాబకీ సా॥ (బాగాతు అవ్వలు తాలూకుదారు) తదితరులను ప్రశంసింపబడిరి. మహాత్మునికి దీర్ఘాయురారోగ్యములు ప్రసాదింప భగవంతుని అందరును ఏకగ్రీవముగా ప్రార్థించిరి. ఈ సందర్భమున మహాత్మునభినందించుచు నొక తంతివార్త పంపబడెను.

తదుపరి అందరకును ఫలాహారములు, పాలును అర్పింపబడినవి. ఈ కార్యమునందు శ్రద్ధవహించి యుండరని సమావేశ పరచినందునకు శ్రీయుత వామన నాయకుగారు సభ్యుల వలన ప్రశంసింపబడిరి. బహిరంగసభ కనుజ్ఞ లభించియుండిన పక్షమున వేలమంది సమావేశమై యుండురు. హైదరాబాదు నగరవాసులకట్టి యదృష్టము లేకపోయెను. ఈ మాత్రమైన ఆనందమును కలిగించినందుకు దే. భ. నాయకుగారును శ్రీమతి ముక్తాబాయిగారును పౌరుల కృతజ్ఞతకు పాత్రులు.

## ఐదువేలరూపాయల ఆశకు విషముపెట్టుట

[హైదరాబాదు మొదటి నాజము ఎదుట]

ఈ అభియోగమునుగురించిన ప్రారంభవిషయములు గోలకొండ పత్రికలో నిదివరకే తెల్పబడినవి. దీనిలో డాక్టరు లక్ష్మయ్యఅనువారు నిందితులలో ముఖ్యులు.

౧ ఆజూరునాడు ఈ అభియోగము విచారణకు వచ్చినది.

న్యాయాధిపతి క్రొత్తగా అమలులోనికి వచ్చిన నియమముల ప్రకారము ఇద్దరుసాక్షుల వాఙ్మూలములు వ్రాసికొని అభియోగపత్రము సెషన్సుకు అప్పగించిరి. నిందితుల పక్షమున సయ్యదు హైదరుజా సా॥ బారిస్టరు, హాజీ సయ్యదలీ సా॥ హైకోర్టువకీలు, ఓరిద్దరును పని చేయుచున్నారు.

## మహమ్మదీయ యువజన సంఘము

వీరి సభ ౧ ఆజూరునాడు [illegible] లో సమావేశమై ఉపన్యాసములు జరిగెను.

# నమ్మకము

## వ్యాపారాభివృద్ధికొక అమూల్యమైన ఆస్తి

ప్రజాసేవ చేయుటలో "హిందుస్థాన్" కు కలిగిన పేరునకు ప్రజలలో దానికిగల నమ్మకమే మూల [illegible] సంవత్సరబడి వారి యొక్క

కార్యనిర్వాహణమునందలి సమర్థత, న్యాయమైన వ్యవహారము, క్లెయిములు వెంటనే చెల్లించుట, ఉదారములయిన నిబంధనలు [illegible] క్రొత్తక్రొత్త ప్రయత్నములు, వివేకవంతముగ భవిష్య మునందున్న వ్యాపార నిలువయుంచుట, క్షేమకరములైన పెట్టుబడులు [illegible] గొప్ప ఆస్తి, ఉపయోగకరమైన సేవ

ప్రజా విశ్వాసమును పుట్టించినవి.

ఈ క్రిందిఅంకెలు మిమ్ములను సమాధాన పెట్టగలవు.

క్రొత్త వ్యాపారము

ఈసంవత్సరము 1934—35

2 కోట్ల 5 లక్షలకు మించిపోయినది.

—(* —

వేయింటికి సంవత్సరము 1 కి బోనసు

ఎండోమెంటుమీద రు 23 | హోల్ లైఫ్ మీద రు 20

## హిందుస్థాన్

### కోఆపరేటివు ఇన్సూరెన్సు సొసయిటి, లిమిటెడ్.

## HINDUSTAN
### Co-Operative Insurance sOciety, Ltd.

హెడ్డాఫీసు: హిందూస్థాన్ బిల్డింగ్సు, కలకత్తా.
శాఖలు: బొంబాయి, మద్రాసు, ఢిల్లీ, పాట్నా, లాహోరు, లక్నో, ఢక్కా.
పూర్తి వివరములు ఆర్గనైజరు, సెంట్రల్ బ్యాంకు బిల్డింగ్సు,
షహరా ఉస్మాని, హైద్రాబాదు నుండి పొందవచ్చును.

భారతదేశపు ప్రధానమైన భీమాకంపెని

